

శ్రీ బూడిద బిక్షమయ్య గౌడ్
శాసన సభ్యులు - ఆలేరు
జిల్లా నల్లగొండ గారి సౌజన్యంతో

# పాటలతో పరీక్షలో విజయాలు

రచన


అనుముల ప్రభాకరాచారి, యం.ఎ., బి.యిడి.

జాతీయ ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు గ్రహీత, స్కూల్ అసిస్టెంట్ (సాంఘిక)
జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల - ఆలేరు, నల్లగొండ జిల్లా.

శాసనసభ సభ్యులుగా అహర్నిషలూ...

ఆలేరు నియోజక వర్గ అభివృద్ధికై ఆలోచిస్తూ...

అనేక సేవలు చేస్తూ...

విద్యార్థిలోకం భావి జీవితం విజయవంతం కావాలని ఆశిస్తూ...

ఈ పాటల పుస్తకాలు ముద్రింపజేసి.....

విద్యార్థిలోకానికి... అందిస్తున్న... యువ...

డైనమిక్ **యం.ఎల్.ఎ. శ్రీ బూడిద బిక్షమయ్య** గారికి

కృతజ్ఞతాభివందనాలు......

రచయిత

**అనుముల ప్రభాకరాచారి**

# 1. గుర్తుంచుకో - 5 లక్షలు

జ్ఞాపక శక్తిని పెంచుకునేందుకు
లేనేలేవోయ్ మందులు మాకులు

" జ్ఞాపక "

మెదడులో ఉంటాయ్ పది వేల కోట్ల న్యూరాన్లు!!!
క్రియాశీలకంగ ఉంటాయందులో
జ్ఞాపక శక్తికి సంబంధించి
ఐదు లక్షల న్యూరాన్లు..... !! అంటే......!
నువ్వు గురుతుంచుకోవచ్చు
ఐదు లక్షల విషయాలు !!!
నీకెందుకింకా? భయాలు ................

" జ్ఞాపక.. "

నీ మెదడులో నింపొద్దసలే
అనవసరపు విషయాలు... !
అదే జరిగితే గురుతుండవసలే

చనిపోయిన వారికి బతికున్న వారికి ఎంతటి తేడా ఉంటుందో అక్షరాస్యులకు
నిరక్షరాస్యులకూ మధ్య అంతటి వ్యత్యాసముంటుంది

.... అరిస్టాటిల్

అవసరమైన విషయాలు...
నీకవసరమైన విషయాలు.. !

॥ జ్ఞాపక ॥

సినిమాలు.. స్నేహితులతో
చిట్..చాట్లు...!! చాటింగులూ..!!
తగ్గించుకోవాలి...!! గాసిప్పులూ కబుర్లూ...!!!
అనవసరమైనవి చేరకుంటే...
మెదడుకు జ్ఞాపక శక్తీ
పెరుగుతుంది..
చదివిందంతా గుర్తుంటుందీ...!!

॥ జ్ఞాపక ॥

జ్ఞాపక శక్తీ సమానమేలే...!!
అందరికి.. మనకందరికీ..
బ్రహ్మ సమయంలో చదివితే..
ఉంటాయ్ ఎన్నో ప్రయోజనాలూ..
ఇక వేసేయ్ మనసుకు కళ్లెం...!!
మీవేలే ఇంక విజయాలూ...

॥ జ్ఞాపక ॥

నువ్వు ఒక విషయాన్ని ఎంత చక్కగా అర్థం చేసికుంటే దానిని అంత గొప్పగా చేయగలవు

- మయా ఆంగ్లో



## 2. మైండ్ హాలిడే - చదువులకు జాలిడే

ఉంటాయ్ మనసుకు మెదడుకు
వేరు వేరుగా లక్ష్యాలు
మనసు చెప్పేదికాక..!! మెదడు
చెప్పేది వినాలోయ్ ॥ ఉంటాయ్ ॥

ఐదు నిమిషాల విశ్రాంతివ్వాలెప్పుడు.
సబ్జెక్ట్ నుంచి మరో సబ్జెక్ట్
చదివేటప్పుడు..!!
అంటారా విశ్రాంతిని 'మైండ్ హాలిడే'..!!
చూడొద్దు 'టీ.వీ.' లు..!! చెప్పుకోవద్దు
కబుర్లప్పుడు..!!
కళ్లను చన్నీటి బట్టతో కప్పుకోవాలి...!!
చదివినదంతా గుర్తుకు తెచ్చుకోవాలి..

॥ ఉంటాయ్ ॥

ఉత్తమ లక్ష్య సాధనకు మేధస్సు మరియు వ్యక్తిత్వం కీలకమైనవి

...మార్టిన్ లూథర్ కింగ్ జూనియర్

'ప్రిపరేషన్ హాలిడేస్' లో

నిద్రపోవాలి!! మధ్యాహ్నం రెండు గంటలు..!!

నిద్రలేచి.. స్నానం చేసి...

చదివితే చాలు...

ఉదయంవలెనే.. ప్రశాంతంగా ఉంటారందరు..!!

'ఒకే రోజు రెండు ఉదయాల టెక్నిక్కది'..!!

ఆచరించి చూస్తే చాలు...!!

పొందేరందరు విజయాలూ...

॥ ఉంటాయ్ ॥

విద్య అత్యంత శక్తివంతమైన ఆయుధం. దాంతో ప్రపంచాన్నే మార్చేయవచ్చు

... నెల్సన్ మండేలా



## 3. టెన్షన్ వదులు - అటెన్షన్

టెన్షన్..!! టెన్షన్

పరీక్ష వేళల ఒకటే టెన్షన్..!!

ఉండాలి నీకు అటెన్షన్..!!

మెదడు లోని కొన్ని చర్యలే

ఆ టెన్షన్..కు కారణాలు..!!

పాటిస్తే కొన్ని చిట్కాలు..!!

పోవునులే ఈ భయాలు..!!

॥ టెన్షన్ ॥

పరీక్ష రాసే పది నిమిషాల ముందు

మూసుకోవాలి కళ్ళు..!!

ఓ రెండు నిమిషాలు చాలు...!!

గుండె నిండా పీల్చుకోవాలి ఊపిరులు...!!

నెమ్మదిగా వదిలితే చాలు..!!

॥ టెన్షన్ ॥

రేపే చనిపోతానేమో అన్నట్లు బ్రతుకు. కాని ఎప్పటికి జీవిస్తానన్నట్లు నేర్చుకో

- మహాత్మాగాంధీ

పిడికిలి బిగించి వదలాలి....!!
ఇలా చేయాలి... అనేక సార్లు..!!
తగ్గుతాయిలే పరీక్ష వేళల టెన్షన్లు..!!

॥ టెన్షన్ ॥

పరీక్ష రాస్తున్నంత సేపు
నోట్లో నములుతుండాలి...!!
ఎలాక్కయను...
తగ్గుతాయిలే ఒత్తిడులు..!!
పరీక్ష వేళల టెన్షన్లు..!!

॥ టెన్షన్ ॥



## 4. చదువూ - నిద్రపో

ఒకే సమయంలో చదవాలోయ్ ప్రతి రోజు..!!
నిద్రపోవాలి ఒకే సమయంలో ఏ రోజు..!!
సగం విజయాలు అవుతాయిలే.. నీ స్వంతాలు..!!

॥ ఒకే ॥

బ్రహ్మ ముహూర్తంలో లేస్తే బహు బాగు..!!
చదివింది బాగా గుర్తుండిపోవు..!!
రాత్రి పది గంటలకు పడుకుంటేనే..!!
అది సాధ్యం..!!

॥ ఒకే ॥

పెన్నూ.. పుస్తకం ఉంచుకోవాలి..
ముఖ్యమైనవి రాసుకోవాలి..!!
పునశ్చరణలో .. కొద్ది సమయంలో..
ఒకేసారి గుర్తుకొస్తాయి అన్నీ..!!

॥ ఒకే ॥

ఐదు నిమిషాల వ్యవధి ఉండాలి..!!
సబ్జెక్ట్ విడిచి సబ్జెక్ట్..
మార్చి చదివేటప్పుడు..

॥ ఒకే ॥

# 5. మనసులోనే చదువూ

బయటకు చదువుట తగ్గించాలి..!!
మనస్సులోనే చదవాలి..!!
ఉంటారప్పుడు అలసిపోకుండా..
సొంత విశ్లేషణతో.. రాయొచ్చుకూడా..!!

॥ బయటకు ॥

ఎలా చదివామన్నది కాదు..!!
ఎంత ఆసక్తిగా చదివామన్నది చూడు..!!
తప్పులు అసలే రాయొద్దు..!!
ఆసక్తి లేకుండా చదవొద్దు...

॥ బయటకు ॥

మనసు పెట్టి.. ఇష్టం పెంచుకు..
భాషా.. విషయాలు.. చదవాలి..!!
బాగా నువ్వు రాయాలి..
అందరికి పేరు తేవాలి..

॥ బయటకు ॥

నాకు తెల్సిందల్లా నా లక్ష్యం పట్ల నిరంతరం జాగరూకతతో ఉండడమే అదే నా విజయ సోపానం

.... అబ్దుల్ కలాం..



# 6. ఆసక్తి - కార్టెక్స్ ఎఫెక్ట్

ఆసక్తి పెంచుకోవాలి.. చదువుపై
అపుడే కలుగుతుంది.. ఇతర విషయాలపై అనాసక్తి..!!
చదువుపై 'ఆసక్తి లేని వారూ'..!!
'ఇతరాలపై ఆసక్తి ఉన్నవారూ..!!

॥ ఆసక్తి ॥

ఆసక్తి పెరగాలంటే.. పరిసరాలు ఉండాలి..
ఆహ్లాదకరం..!!
చూసుకోవాలి ఉండేట్టు.. ప్రశాంతంగా
చుట్టూ వాతావరణం..

॥ ఆసక్తి ॥

ఆసక్తి ఉంటేనే.. గుర్తుంటాయి..
అన్ని విషయాలు..!!
రోజు ఉండాలి.. కొంత సమయం..
ఎవరితో.. ఏమీ.. మాట్లాడకుండ..!!

॥ ఆసక్తి ॥

నిశబ్దంగా ఉంటేనే.. పెరుగుతుంది..!!
ఏకాగ్రత.. జ్ఞాపక శక్తీ..!!
నియంత్రించుకోవాలి.. మనస్సు..
అపుడే లక్ష్యం చేరటం.. సులువు..

॥ ఆసక్తి ॥

జీవితంలో చివరి వరకూ సహనంతో ఉండగలిగిన వాళ్ళే విజయం సాధిస్తారు

... జేమ్స్

# 7. డయేరియా ఆఫ్ టాకింగ్

'అదర్ ఇంటరెస్ట్' ఉండటమే కదా..అనాసక్తి..!!
ఇతర ఆసక్తులు తగ్గించవా..!!
చదువుపై.. ఆసక్తి..
గొప్ప చదువులు మరి..
చదివేదేలా?!!..
నువ్వు తెలుసుకుంటే పోలా..!!?

॥ అదర్ ॥

'టీ.వీ.'లు.. సినిమాలు చూడటం..
చిట్..చాట్లు స్నేహితులతో..
తగ్గించాలి బాగా.. గాసిప్పులూ..!!
'డయేరియా ఆఫ్ టాకింగ్'...
అంటారు వీటిని..
ఉండాలి.. దూరంగ.. వాటికీ..!!

॥ అదర్ ॥

చదువుకునేప్పుడు.. కట్టేయాలి
..'టీ.వీ.'ని.. ఇంట్లోని వారందరూ..!!
లేకుంటే ఉండదు.. ఏకాగ్రత
పుస్తకాలు ముందేసుకు.. కూర్చున్నా...!!!?
పక్కనే కూర్చోవాలి ఎదో పనితో
చదువుకునే వాని పక్కనే పెద్దలు..!!

॥ అదర్ ॥

నేను చేయగలను అనే నమ్మకం గలవాడు... చేస్తాడు



# 8. చదవాలి - రాయాలి

ఏర్పాటు చేసుకో..! చదవాల్సిన
అంశాలున్న సబ్జెక్టును ముందు..!
ఆ తర్వాత.. రాసే అంశాలున్న..
సబ్జెక్టులను పెట్టుకోవాలి చివర్లో..!

దొరుకుతుందిలే సమయం ఎక్కువ.. చదివేందుకు నీకు..
పరీక్షలో విజయాలే.. కల్గుతాయి..నీకూ...!

॥ ఏర్పాటు ॥

చదివేటప్పుడు రాసుకోవాలి..!
ముఖ్యమైన సంగతులన్నీ..!
పునశ్చరణ సమయంలో..!
గుర్తుకు తెచ్చుకోవచ్చు
కొద్ది సమయంలోనే విషయాలన్నీ..!
ఇంకెందుకు పోవు । భయాలన్నీ......!

॥ ఏర్పాటు ॥

కాలాన్ని సద్వినియోగం చేసుకునేవాడికి తీరికే ఉండదు

## 9. సబ్జెక్టు బోరు - మార్కులు నూరు

కొన్ని సబ్జెక్టులంటే.. బోరు నాకంటే...!
పరీక్షల్లో రావు కదా,, మార్కులు నూరు!
అసలు ఇష్టం లేని సబ్జెక్టు పట్ల
పెంచుకోవాలి ఇష్టం...!
లేకుంటే మనకే కష్టం...!

॥ కొన్ని ॥

ఇష్టమైన.. ఆసక్తి గల సబ్జెక్టును...!
చదువు కోవాలి.. రెండు ఆసక్తి లేని
సబ్జెక్టుల నడుమ...!
ముందు బోర్ కొట్టే సబ్జెక్టు చదవాలి !
తర్వాత వెంటనే.. ఇష్టమైన దాన్ని..చదవాలి...!
తగ్గుతుంది బోరు
పెరుగుతుంది చదువులో జోరు...!
వస్తాయిలే మార్కులు నూటికి నూరు...!

॥ కొన్ని ॥

బంగారంలో ప్రతి సన్నని తీగకు విలువ ఉన్నట్లే జీవితంలో ప్రతి క్షణానికి విలువ ఉంటుంది



ఈ **పరీక్షలో విజయ గీతాల** ను ఆదరించి..... విద్యార్థులకు
అందించేటందుకు సహకరిస్తున్న
కళాశాల గౌరవ ప్రిన్సిపల్స్ ....
అధ్యాపకులు...
మండల విద్యాధికారులు ....
ప్రధాన ఉపాధ్యాయులూ....
ఉపాధ్యాయ........ విద్యార్థి లోకం........ తల్లిదండ్రులూ............
అందరకూ.......... అభివందనాలు.....

ఈ కార్యక్రమ నిర్వాహకులు
**శ్రీ తునికి విజయసాగర్** ఫిజికల్ డైరెక్టర్, హైస్కూల్, ఆలేరు
జిల్లా ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు గ్రహీత గారికి .........,
సహకారం అందించిన **శ్రీకర్** (బి.టెక్.) అధ్యక్షులు,
**శ్రీపాద జయలక్ష్మి** మహిళా కార్యదర్శి...,
కళాసూర్య కల్చరల్ ఆర్గనైజేషన్ గారికి... ప్రత్యేక కృతజ్ఞతలు

రచయిత
**అనుముల ప్రభాకరాచారి**



సహకారం

# కళాసూర్య

రిజిష్టర్డ్. 1996 నుండి

## ఎడ్యుకేషనల్ ఫౌండేషన్

యాదగిరిగుట్ట - ఆలేర్

హెడ్ ఆఫీస్ - నాచారం, హైదరాబాద్ - 9032689474

ఎడ్యుకేషనల్ ఫౌండేషన్, భక్తి భావన, ఆర్ట్స్ - పీస్‌ఫుల్ కమ్యునిటీ, వుమెన్ వరల్డ్, జానపద వైభవం, పాటల ప్రపంచం, వికలాంగుల సేవలు, కళాభారతి (ప్రచురణలు), మహానుభావుల ముఖ్య దినోత్సవాలు, ఉద్యోగ సాఫల్య, జీవితసాఫల్య పురస్కారాలు, కళాసూర్య సన్మానము, కళాసూర్య అవార్డులు, బాలసూర్య అవార్డులు - జాతీయ సమైక్యతా కార్యక్రమాలు, ఇంకా ఎన్నెన్నో సేవా కార్యక్రమాలు... మీకు ఇష్టమైన పై సేవలలో వేటికైనా, అన్నింటికైనా సహాయమందించండి,

... చేయించేది మీరు - చేసేది మేము